# అథ పంచవింశో%ధ్యాయః

## పద్మా పిప్పలాదుల చరితము

నందీశ్వర ఉవాచ |

అథ లోకే వ్యవస్థాయ ధర్మస్య స్థాపనేచ్ఛయా | మహాలీలాం చకారేశస్తామహో సన్మునే శృణు || 1

ఏకదా పుష్పభద్రాయాం స్నాతుం గచ్ఛన్మునీశ్వరః | దదర్శ పద్మాం యువతీం శివాంశాం సుమనోహరామ్ || 2

తల్లిప్సుస్తత్పితు స్థ్సాన మనరణస్య భూపతేః | జగామ భువనాచారీ లోకతత్త్వ విచక్షణః || 3

రాజా నరాణాం తం దృష్ట్వా ప్రణమ్య చ భయాకులః | మధుపర్కాదికం దత్త్వా పూజయామాస భక్తితః|| 4

స్నేహాత్సర్వం గృహీత్వా స యయాచే కన్యకాం మునిః | మౌనీ బభూవ నృపతిః కించిన్నిర్వక్తు మక్షమ| || 5

మునిః ప్రోవాచ నృపతి కన్యాం మే దేహి భక్తితః | అన్యథా భస్మ సాత్సర్వం కరిష్యే%హ త్వయా సహ || 6

అథో బభూవురాచ్ఛన్నా స్సర్వే రాజజనాస్తదా | తేజసా పిప్పలాదస్య దాధీచస్య మహామునే || 7

నందీశ్వరుడిట్లు పలికెను-

ఓ మహర్షీ! తరువాత ఈశ్వరుడు లోకములో నున్నవాడై ధర్మమును స్థాపించదలచి గొప్ప అద్భుతమగు లీలను చేసెను. ఆ వృత్తాంతమును వినుము (1). ఒకనాడు ఆ మహర్షి పుష్పభద్రానదిలో స్నానము చేయుటకు వెళ్లుచూ, పార్వతి అంశతో జన్మించిన పద్మయను సుందర యువతిని గాంచెను (2). లోకస్వభావమునెరింగి లోకాచారము ననుసరించి ఆ మహర్షి ఆమెను పొందగోరి ఆమె తండ్రియగు అనరణ్య మహారాజువద్దకు

వెళ్లెను (3). రాజు ఆయనను గాంచి భయముతో కంగారుపడి నమస్కరించి భక్తితో మధుపర్కాదులనిచ్చి పూజించెను (4). ఆ మహర్షి ప్రేమతో వాటినన్నిటినీ స్వీకరించి కన్యనిమ్మని గోరెను. ఆ రాజు ఏమియు మాటలాడే సామర్థ్యములేని వాడై మౌనముగా నిలబడెను (5). అపుడా మహర్షి ఇట్లు పలికెను. రాజా! నాకు భక్తితో కన్యను సమర్పించుము. అట్లు ఈయనిచో, నేను నీతో సహా సర్వమును భస్మము చేసెదను (6). ఓ మహర్షీ! అపుడు దధీచుని పుత్రుడగు పిప్పలాదమహర్షి యొక్క తేజస్సుచే రాజపరివారమంతయూ కప్పి వేయబడెను (7).

అథ రాజా మహా భీతో విలప్య చ ముహుర్ముహుః | కన్యామలంకృతాం పద్మాం వృద్ధాయ మునయే దదౌ || 8

పద్మా వివాహ్య స ముని శ్శివాంశాం భూపతేస్సుతామ్ | పిప్పలాదో గృహీత్వా తాం ముదితస్స్వాశ్రమం య¸° || 9

తత్ర గత్వా మునివరో వయసా జర్జరో%ధికః | ఉవాస నార్యా స తయా తపస్వీ నాతిలంపటః || 10

అథో%నరణ్య కన్యా సా సిషేవే భక్తితో మునిమ్ | కర్మణా మనసా వాచా లక్ష్మీర్నారాయణం యథా || 11

ఇత్థం స పిప్పలాదో హి శివాంశో మునిసత్తమః | రేమే తయా యువత్యా చ యువా భూయ స్వలీలయా || 12

దశపుత్రా మహాత్మానో బభూవుస్సుతపస్వినః | మునేః పితుస్సమాస్సర్వే పద్మాయాస్సుఖవర్ధనాః || 13

ఏవం లీలా వతారో హి శంకరస్య మహాప్రభోః | పిప్పలాదో మునివరో నానాలీలాకరః ప్రభుః || 14

తరువాత ఆ రాజు మిక్కిలి భీతిల్లి పలుపర్యాయములు విలపించి వృద్ధుడగు మహర్షికి పద్మయను పేరు గల అలంకృతయగు ఆ కన్యను ఇచ్చి వివాహము చేసెను (8). ఆ మహర్షి పార్వతి అంశతో మహారాజపుత్రికయై జన్మించిన పద్మను వివాహమాడి, ఆమెను

తీసుకొని ఆనందముతో తన ఆశ్రమమును చేరుకొనెను (9). వయస్సుపై బడినవాడు, తపశ్శాలి, అధికమగు ఇంద్రియాసక్తి లేనివాడు అగు ఆ మహర్షి ఆశ్రమమునకు వెళ్లి ఆమెతో కలిసి జీవింప జొచ్చెను (10). అపుడు అనరణ్యుని కుమార్తెయగు ఆమె నారాయణుని లక్ష్మీవలె ఆ మునిని మనోవాక్కాయ కర్మలతో భక్తి పూర్వకముగా సేవించెను (11). అపుడు శివాంశసంభూతుడగు ఆ పిప్పలాదమహర్షి తన లీలచే యువకుడుగా మారి ఆ యువతితో గూడి రమించెను (12). పద్మా పిప్పలాదులకు మహాత్ములు, గొప్ప తపశ్శాలులు, తండ్రితో సమానమైన వారు అగు పదిమంది పుత్రులు కలిగిరి. వారందరు తల్లిదండ్రుల సుఖమును ఇనుమడింప జేసిరి (13). ఈ విధముగా లీలతో అవతారములను గ్రహించు శంకరమహా ప్రభుడు పిప్పలాదమహర్షిగా అవతరించి అనేక లీలలను ప్రకటించెను (14).

యేన దత్తో వరః ప్రీత్యా లోకేభ్యో హి దయాలునా | దృష్ట్వా లోకే శ##నేః పీడాం సర్వేషామనివారిణీమ్ || 15

షోడశాబ్దావధి నృణాం జన్మతో న భ##వేచ్చ సా | తథా చ శివభక్తానాం సత్యమేతద్ధిమే వచః || 16

అథానాదృత్య మద్వాక్యం కుర్యాత్పీడాం శనిః క్వచిత్ | తేషాం నృణాం తదా స స్యాద్భస్మసాన్న హి సంశయః || 17

ఇతి తద్భయతస్తాత వికృతో%పి శ##నైశ్చరః | తేషాం న కురుతే పీడాం కదాచిత్ గ్రహసత్తమః || 18

ఇతి లీలామనుష్యస్య పిప్పలాదస్య సన్మునే | కథితం సుచరిత్రం తే సర్వకామ ఫలప్రదమ్ || 19

గాధిశ్చ కౌశికశ్చైవ పిప్పలాదో మహామునీః | శ##నైశ్చరకృతాం పీడాం నాశయంతి స్మృతాస్త్రయః || 20

పిప్పలాదస్య చరితం పద్మా చరిత సంయుతమ్ | యః పఠే చ్ఛృణుయాద్వాపి సుభక్తో భువి మానవః || 21

శని పీడా వినాశార్థమేతచ్చరితముత్తమమ్ | యః పఠేచ్ఛృణుయాద్వాపి సర్వాన్ కామానవాప్నుయాత్ || 22

దయాళువగు ఆ మహర్షి లోకములో సర్వులకు శని బాధ అనివార్యముగా నుండుటను గాంచి ప్రేమతో జనులకు ఒక వరము నొసంగెను (15). పుట్టినప్పటినుండి పదునారు సంవత్సరములు వయస్సు వచ్చువరకు మానవులకు శని బాధ ఉండదు. ఈ నా వచనము సత్యము (16). నా ఈ వచనమును లెక్కసేయకుండా శని ఎక్కడైననూ మానవులకు పీడను కలిగించినచో, ఆ శని నిస్సందేహముగా భస్మమగును (17). గ్రహరాజమగు శని పీడాకరుడే అయిననూ ఇట్లు శివుని భయము ఉండుట వలన వారికి ఎన్నడైననూ పీడను కలిగించుటలేదు (18). ఓ వత్సా! మహర్షీ! లీలచే పిప్పలాదుడై మనుష్యావతారమున దాల్చిన శివుని పవిత్ర గాథను నీకీ తీరున వివరించితిని. ఈ గాథ సర్వకామనలను, ఫలములను ఇచ్చును (19). గాధి, కౌశికుడు మరియు పిప్పలాదమహర్షి అను ముగ్గురినీ స్మరించినచో శనివలన కలిగిన పీడ దూరమగును (20). పద్మాపిప్పలాదుల చరితమును భూలోకములో ఏ మానవుడు మంచి భక్తితో పఠించునో, లేక వినునో వాని కోర్కెలన్నియు ఈడేరును. ఉత్తమమగు ఈ చరితము శని బాధను తొలగించును (21, 22).

ధన్యో మునివరో జ్ఞానీ మహాశైవస్సతాం ప్రియః | అస్య పుత్రో మహేశానః పిప్పలాదాఖ్య ఆత్మవాన్ || 23

ఇతి శ్రీ శివమహాపురాణ  శతరుద్రసంహితాయాం పిప్పలాద అవతార చరితవర్ణనం నామ పంచవింశో%ధ్యాయః (25).

జ్ఞాని, మహాశివభక్తుడు, సత్పురుషులకు ప్రియుడు అగు దధీచమహర్షి ధన్యుడు. మహేశ్వరుడే ఆయనకు పుత్రుడై జన్మించెను. ఆయనయే ఆత్మజ్ఞానియగు పిప్పలాదుడు (23). పవిత్రమైనది, స్వర్గమునిచ్చునది, చెడు గ్రహముల దోషమునపహరించునది అగు ఈ గాథ కోర్కెల నన్నిటినీ ఈడేర్చును. వత్సా! ఈ గాథ శివభక్తిని వర్ధిల్ల జేయును (24).

శ్రీ శివ మహాపురాణములోని శతరుద్రసంహితయందు పిప్పలాద అవతార చరిత వర్ణనమనే ఇరువది అయిదవ అధ్యాయము ముగిసినది (25).